# పన్నెండు మైళ్ల ప్రేమ





ఆ రాత్రి ఎంతో ప్రత్యేకమైనది. ఫ్రెడ్రిక్‌ని చూడటానికి వాళ్లమ్మ వచ్చింది. ఆమె తెచ్చిన అల్లం కేక్‌తో అతని పొట్ట నిండిపోయింది. ఫ్రెడ్రిక్ ఆమె ఒడిలో కూర్చుని ఉన్నాడు. దీపం వెలుగులోని వంటింటిని ఆమె వెచ్చదనం, పాట నింపేశాయి.

అమ్మతో, అమ్మమ్మ బెట్సీతో ఉన్నప్పటి ఆనంద క్షణాలను ఫ్రెడ్రిక్ గుర్తు చేసుకున్నాడు. ఇప్పుడు వాళ్లకి దూరంగా అతను ఒక ముసలి యజమాని ఇంటిలో కోపిష్టి అయిన అత్తతో ఉంటున్నాడు.

అమ్మ పాడటం అయిపోగానే, “అమ్మా, నేను మీతో ఎందుకు ఉండటం లేదు?” అని ఫ్రెడ్రిక్ అడిగాడు.



“నువ్వు మాతో ఉంటే బాగుండునని నాకు కూడా ఉంది,” అమ్మ అంది. “కానీ పగలంతా మొక్కజొన్న చేలలో పని చేసే నాకు నిన్ను చూసుకోవటం కుదరటం లేదు.”

“మిమ్మల్ని చూడటానికి నేను రావచ్చా?” ఫ్రెడ్రిక్ అడిగాడు.

“లేదు, బిడ్డా. అది చాలా దూరం.” “ఎంత దూరం?” అతను అడిగాడు.

“పన్నెండు మైళ్లు.” “కానీ, నువ్వు నడుచుకుంటూ వచ్చావు కదా, అమ్మా.”

“అది నాకు దూరం కాదు,” అమ్మ అంది. “నేను నడిచే విధానం వల్ల అది అంత దూరం అనిపించదు.” “నువ్వు ఎలా నడుస్తావో చెప్పు, అమ్మా. దూరం ఎలా తగ్గుతుందో చెప్పు.”

ఫ్రెడ్రిక్ అమ్మ వైపు చూశాడు. కొడుకుని చూసి నవ్వుతున్న ఆమె కళ్లల్లో దీపం వెలుగు ప్రతిబింబిస్తోంది.

“ప్రతి మైలు ప్రత్యేకమైనది, ఫ్రెడ్రిక్. ఒక్కొక్క మైలుని ఒక్కొక్క దానికి కేటాయిస్తాను.”

ఇది వినటం ఫ్రెడ్రిక్‌కి చాలా ఇష్టం.

“మొదటి మైలు దేనికి?” అతను అడిగాడు.

“అది నేను మరిచిపోటానికి?” అమ్మ బదులిచ్చింది.

“ఏం మరిచిపోతావు?”

“నా అలసటని మరిచిపోతాను. వెన్ను నొప్పి పుడుతోందని, కాళ్లూ, చేతులూ లాగుతున్నాయని మరిచిపోతాను. రోజంతా పొలంలో పని చేసానని, తెల్లవారటంతోనే మళ్లీ పనిలోకి వెళ్లాలని మరిచిపోతాను. మరిచిపోవటం అయిపోయిన తరవాత గుర్తు చేసుకుంటాను. రెండవ మైలు దాని కోసమే.”



“రెండవ మైలులో ఏం గుర్తు చేసుకుంటావు?” ఫ్రెడ్రిక్ అడిగాడు.

“నిన్ను గుర్తు చేసుకుంటాను, ఫ్రెడ్రిక్. ఉడతల వెంట పరిగెత్తటం నీకు ఇష్టమని గుర్తు చేసుకుంటాను. నేను వండిన అన్నం ఎలా తినేవాడివో గుర్తు చేసుకుంటాను. ఎప్పుడూ ప్రశ్నలు అడుగుతుండేవాడివని గుర్తు చేసుకుంటాను!”

ఫ్రెడ్రిక్ నవ్వాడు. అతనిని తల్లి ఇంకా దగ్గరకి హత్తుకుంది. “నువ్వు నా కొడుకువి కావటం నాకు ఎంతో సంతోషాన్ని ఇస్తుందని గుర్తు చేసుకుంటాను.”

ఫ్రెడ్రిక్ నిటారుగా కూర్చుని, వేలితో ఛాతీని తడుతూ, “నేను హారియెట్ బేలీ కొడుకుని,” అన్నాడు.

“కేటీ అత్త నిన్ను కష్టపెట్టినప్పుడు ఆ విషయం గుర్తుంచుకో,” అమ్మ మెల్లగా అంది. వంటింటి పైని అటక గదిలో కేటీ అత్త కదలికల చప్పుడు కావటంతో ఆమె పైకి చూసింది.

“నువ్వు ఇంకా ఏమి గుర్తు చేసుకుంటావు, అమ్మా?” ఫ్రెడ్రిక్ అడిగాడు.







“నేను వినటం గుర్తు చేసుకుంటాను,” అమ్మ అంది

“మూడవ మైలు దాని కోసమేనా?” ఫ్రెడ్రిక్ అడిగాడు.

“అవును,” అమ్మ అంది. “రాత్రి శబ్దాలను వినటం కోసం.”

“ఏమి వింటావు, అమ్మా?”

“కీచురాళ్ల రొదను, గుడ్లగూబల అరుపులను, చెట్లలో జంతువుల కదలికలను వింటాను.” “నీకు అవి అర్థమవుతాయా?”

“అవుతాయి, ఫ్రెడ్రిక్,” అమ్మ గొంతు గుసగుసగా ఉంది. “రేయి చప్పుళ్లు విన్నప్పుడు, ‘పైకి చూడు, హారియట్, పైకి చూడు,’ అంటున్నట్టు ఉంటుంది.”





“నాల్గవ మైలు పైకి చూడటానికేనా,” ఫ్రెడ్రిక్ అడిగాడు.

అమ్మ తలూపింది. “తలెత్తి ఆకాశంలోని నక్షత్రాలు చూడటం కోసం.”

“ఎన్ని నక్షత్రాలు ఉంటాయి, అమ్మా?”

“లెక్క పెట్టలేనన్ని. ఒక్కొక్కసారి అవి నా ముందున్న ఆకాశమంతా పరుచుకుని కనిపిస్తాయి. ఒక్కొక్కసారి చెట్ల మధ్యలోంచి ఒక్కొక్క నక్షత్రం మిణుకుమిణుకుమంటుంది. ఆ నక్షత్రాలను చూసి ఆశ్చర్యపోతాను.”

“దేని గురించి ఆశ్చర్యపోతావు?” ఫ్రెడ్రిక్ అడిగాడు.
“ఈ నక్షత్రాలను, జంతువులను, నిన్ను, నన్ను చేసిన దేవుడిని తలుచుకుని ఆశ్చర్యపోతూ అయిదవ మైలు నడుస్తాను...”
“అమ్మా?”
“ఏమిటి, ఫ్రెడ్రిక్?”
“మనల్ని దేవుడు బానిసలను ఎందుకు చేశాడు?”
“దేవుడు మనలను బానిసలను చెయ్యలేదు, ఫ్రెడ్రిక్. మనందరం దేవుని బిడ్డలమే. మనకి మంచి రోజులు రానున్నాయి.”
“నీకెలా తెలుసు?” ఫ్రెడ్రిక్ అడిగాడు.
“ప్రార్థిస్తాను కాబట్టి నాకు తెలుసు,” ఆమె బదులిచ్చింది.



“ఆరవ మైలు ప్రార్థిస్తూ గడుపుతావు,” చేతులు జోడిస్తూ అన్నాడు ఫ్రెడ్రిక్.

“ప్రార్థన చెయ్యటం నాకు తెలుసు, అమ్మా. ఐజాక్ మామ నాకు దేవుని ప్రార్థన నేర్పించాడు.”

“నేను చిన్నగా ఉన్నప్పుడు ఐజాక్ మామ నాకు కూడా ప్రార్థించటం నేర్పాడు. అతను జ్ఞానియైన వృద్ధుడు. ఆఫ్రికాలో పుట్టాడు.”

“ఆఫ్రికా ఎక్కడ ఉంది?” ఫ్రెడ్రిక్ అడిగాడు. “చాలా దూరాన ఉంది,” అమ్మ చెప్పింది. “నడవలేనంత దూరమా?”

“అవును, నేను కూడా నడవలేనంత దూరం!” అమ్మ నవ్వుతూ చెప్పింది. “అది విశాలమైన సముద్రానికి ఆవల వైపున ఉంది.”

“సముద్రం ఎంత వెడల్పు ఉంటుంది?” ఫ్రెడ్రిక్ అడిగాడు.

“మనం కొలవలేనంత వెడల్పు.”

“ఆఫ్రికాలోని ప్రజలు స్వేచ్ఛగా ఉంటారా?”

“వాళ్లు స్వేచ్ఛగా ఉంటారు. కానీ ఆఫ్రికాలో జీవితం కూడా కష్టంగా ఉంటుంది. స్వేచ్ఛగా ఉన్నప్పుడు కష్టపడి పని చెయ్యటం బాధగా అనిపించదు. దాని కోసమే నేను ప్రార్థన చేస్తాను, ఫ్రెడ్రిక్. మనమందరం స్వేచ్ఛగా ఉండే రోజు రావాలని నేను ప్రార్థన చేస్తాను. అలా ప్రార్థన చెయ్యటంతో నాకు పాటలు పాడాలనిపిస్తుంది.”



“ఏడవ మైలు పాటలు పాడటానికి!” ఫ్రెడ్రిక్ అన్నాడు. “నువ్వు ఏ పాటలు పాడతావు, అమ్మా? సంతోషకరమైనవా, విషాద గీతాలా?”

“నా హృదయానికి నచ్చిన పాటలు పాడతాను,” అమ్మ జవాబిచ్చింది. “హుషారు పాటలైనా, విషాద పాటలైనా పాడటం వల్ల నా మనస్సు తేలికవుతుంది. మనస్సు తేలిక కావటంతో ఎనిమిదవ మైలు నడవటానికి సిద్ధం అవుతాను.”



“ఎనిమిదవ మైలు దేనికి?” ఫ్రెడ్రిక్ అడిగాడు. “నవ్వటానికి. నేను సంతోషకరమైన వాటి గురించి ఆలోచిస్తాను, మంచి రోజుల గురించి ఆలోచిస్తాను.” “ఎలాంటి మంచి రోజులు, అమ్మా?” “ఉదాహరణకు మొక్క జొన్న కోసే రోజులు. మేం ఒకరి పొలం తరవాత ఒకరి పొలానికి వెళుతూ ఒకరికొకరం సహాయం చేసుకుంటాం. ఏ జట్టు తొందరగా మొక్కజొన్న కంకులు కోసి ఎత్తైన గుట్ట చేస్తుందోనని పోటీ పడతాం. నీ జీవితంలో అంత పెద్ద గుట్టలు చూసి ఉండవు!” “ఎంత ఎత్తు గుట్టలు?” “కొలవలేనంత ఎత్తు,” అమ్మ చెప్పింది. “అవి చాలా పని ఉండే రోజులు. అయితే అవి కష్టాలను మరొకరితో చెప్పుకునే రోజులు కూడా, పరాచికాలు ఆడుకునే రోజులు, నవ్వుకునే రోజులు! పనంతా అయిన తరవాత బాగా తింటాం, డాన్స్ చేస్తాం.”

“డాన్సా!” అన్నాడు ఫ్రెడ్రిక్. “నువ్వు డాన్స్ చేస్తావా, అమ్మా?”

“ఆఁ! మొక్కజొన్న పొట్టు తీసే డాన్స్, బుర్రుపిట్ట గెంతులు, గువ్వ రెక్కల ఊపులు.” ఆ పేర్లు విని ఫ్రెడ్రిక్ కిసుక్కుమంటూ నవ్వాడు.

“ఇప్పుడు నువ్వు డాన్స్ చెయ్యటం చూద్దాం, అబ్బాయీ,” అమ్మ అంది. “రా, గువ్వ రెక్కల ఊపుల డాన్స్ నీకు చూపిస్తాను.”

వాళ్లు నిలబడి దీపం వెలుగులోని వంటింట్లో డాన్స్ చేశారు. అమ్మ తన పొడవాటి చేతులను ఊపితే, ఫ్రెడ్రిక్ తన చిన్న చేతులను కదిలించాడు. అతనిని పైకెత్తి, గిరగిరా తిప్పింది. తరవాత, కిందకి దించే ముందు ఒకసారి గట్టిగా హత్తుకుంది.

చివరి మైళ్లలోకి వస్తున్నామని, అమ్మ త్వరలోనే వెళ్లిపోతుందని ఫ్రెడ్రిక్‌కి తెలుసు. చివరి మైలు గురించి అమ్మని అడగాలని అతనికి లేదు. డాన్స్ చేస్తూ అతను అడగకుండా ఉంటే అమ్మ వెళ్లిపోకుండా ఉంటుందని అతని ఆశ.



అతనిని మళ్లీ కుర్చీ దగ్గరకి తీసుకుని వెళ్లి, "తొమ్మిదవ మైలు దేనికో తెలుసా, ఫ్రెడ్రిక్?" అమ్మ మెత్తగా అడిగింది.

"ధన్యవాదాలు తెలపటానికి."

"అవును. నాకు ఈ జీవితాన్ని, ఇక్కడి దాకా నడిచేటంత ఆరోగ్యాన్ని ఇచ్చినందుకు దేవుడికి ధన్యవాదాలు తెలియచేస్తాను. నిన్ను ఇచ్చినందుకు, దేవుడికి ధన్యవాదాలు తెలియచేస్తాను, ఫ్రెడ్రిక్. నువ్వు నాకు ఆశని ఇస్తావు."

"పదవ మైలు ఆశకా?"

"అవును ఫ్రెడ్రిక్. నీపై నాకు ఎన్నో ఆశలు ఉన్నాయి. ఒక రోజు మనందరం స్వేచ్ఛగా జీవిస్తామని, కుటుంబం లాగా కలిసి ఉంటామని నాకు ఆశ ఉంది."





"స్వేచ్ఛగా ఉండటమంటే ఎలా ఉంటుంది, అమ్మా?" ఆవలిస్తూ అడిగాడు ఫ్రెడ్రిక్.

"నువ్వు పదకొండవ మైలు గురించి మాట్లాడుతున్నావు. అది కలలు కనే మైలు. నేను స్వేచ్ఛగా జీవిస్తానని కలగంటాను. మనకు సొంతానికి భూమి ఉంటుంది. మన పొలంలో మనం పని చేస్తాం. బానిసలు ఉండరు, యజమానులు ఉండరు. మనం ఎవరి సొత్తూ కాదు."

"నువ్వు నా గురించి కల గంటావా, అమ్మా?"

"ఆఁ! నీ భవిష్యత్తు గురించి కలగంటాను, ఫ్రెడ్రిక్. నువ్వు చాలా తెలివైనవాడివి. ఏదో ఒక రోజు నువ్వు గొప్ప విషయాలు సాధిస్తావు. ఇప్పుడైతే నువ్వు నిద్రపోయే సమయం అయ్యింది."

"కానీ నేను అలిసిపోలేదు," ఫ్రెడ్రిక్ అన్నాడు. "నాకు తెలుసు. అయితే అమ్మ తిరిగి వెళ్లాలి."

ఫ్రెడ్రిక్‌ని అమ్మ మరోసారి హత్తుకుని అతను నిద్రపోయే చోటుకి తీసుకుని వెళ్లింది. మొక్కజొన్న పొట్టుతో చేసిన పలచటి బొంత మీద ఫ్రెడ్రిక్ పడుకున్నాడు. అమ్మ మోకాళ్ల మీద కూర్చుని పాత దుప్పటి ఒకటి అతనికి కప్పింది.

"అమ్మా, పన్నెండవ మైలు దేనికి?" ఆ ప్రశ్న అడుగుతున్నప్పుడు ఫ్రెడ్రిక్ కనురెప్పలు నిద్రతో బరువెక్కి ఉన్నాయి.

"చివరి మైలు తేలికైనది, ఫ్రెడ్రిక్," వంగి అతని బుగ్గ మీద ముద్దు పెడుతూ చెప్పింది అమ్మ. "పన్నెండవ మైలు ప్రేమకి."



వెన్నెల రేయిలోకి అమ్మ అడుగు పెట్టేపాటికి ఫ్రెడ్రిక్ నిద్రపోయాడు. మరునాడు ఉదయమే లేచిన ఫ్రెడ్రిక్ బయటకు పరిగెత్తి, అమ్మ వెళ్లిన దారిలో కనుచూపు మేర చూశాడు. అతను విచారంగా ఉన్నప్పటికీ అమ్మ తనతో ఉందని అతనికి అనిపిస్తోంది. ఆమె మాటలే అతని తలపులలో తిరుగుతున్నాయి.

అతను లెక్కపెట్ట లేనివి, కొలవ లేనివి ఉన్నాయని అమ్మ చెప్పింది: చాలా నక్షత్రాలు ఉన్నాయి, సముద్రం చాలా వెడల్పుగా ఉంటుంది, మొక్కజొన్న కంకుల గుట్ట చాలా ఎత్తుగా ఉంటుంది. కానీ అతను కొలవగలిగింది ఒకటి ఉంది. అతని తల్లి ప్రేమ పన్నెండు మైళ్ల పొడవని ఫ్రెడ్రిక్ హృదయానికి తెలుసు.

## చివరి మాట...

అతని తల్లి ఆశించినట్టు ఫ్రెడ్రిక్ స్వేచ్ఛని పొందాడు. బానిసత్వం నుంచి తప్పించుకుని, తన పాత యజమానులకు దొరకకుండా ఉండటానికి తన చివరి పేరు బేలీ అన్నది తీసేసి డగ్లస్ అని పెట్టుకున్నాడు. అంతేకాదు, ఇతర బానిసలు స్వేచ్ఛని పొందటంలో ఫ్రెడ్రిక్ డగ్లస్ సహాయం చేశాడు. తరవాత బానిసత్వానికి వ్యతిరేకంగా రాస్తూ, సభలలో మాట్లాడుతూ పేరు పొందాడు. బానిసలుగా ఉన్న వాళ్ల స్వేచ్ఛ గురించి అధ్యక్షుడు అబ్రహం లింకన్‌తో మాట్లాడటానికి అతను స్వేత సౌధానికి చాలాసార్లు వెళ్లాడు. బానిసత్వం చివరికి అంతం అయిన తరవాత మహిళల హక్కుల కోసం డగ్లస్ పోరాడాడు.

తాను పెద్దవాడు అయ్యేవరకు తల్లి బతికి లేనప్పటికీ, తనని చూసి గర్వ పడేదని అతనికి తెలుసు. తన విజయానికి ప్రధాన కారణం తన తల్లి అని అతను చెప్పేవాడు. చాలామంది బానిసల లాగా కాకుండా హేరియట్ బేలీ చదవగలిగేది. తన యజమాని కుటుంబ సభ్యుల నుంచి ఫ్రెడ్రిక్ చదవటం నేర్చుకున్నట్టే ఆమె కూడా నేర్చుకుని ఉండవచ్చు. హేరియట్ బేలీ మంచి మాటకారి. తన కొడుకుని చూడటానికి రాత్రి వేళల్లో వచ్చినప్పుడు ఆ నైపుణ్యాన్ని ఆమె కొడుకుకి అందించి ఉండవచ్చు. 'అతను ఉత్తి పిల్లవాడు కాదు, తన తల్లి కొడుకు' అన్న గొప్ప పాఠాన్ని ఆమె నేర్పిందని డగ్లస్ తన ఆత్మ కథలో రాసుకున్నాడు. తాను బానిసత్వంలో బతకటానికి కాకుండా గొప్ప విషయాలు సాధించి చెప్పుకోదగిన జీవితం జీవించటానికి పుట్టానన్న ఆత్మ విశ్వాసాన్ని అతను ఆమె ప్రేమ నుంచి పొందాడు.

అయిపోయింది